31 MAY 1922

శ్రీ

శ్రీవిష్ణ

# శ్రీగజేంద్రమోక్షదండకము.

ఇది

భగవద్భక్తుల కత్యంతోపయుక్తంబగు
నటుల సర్వజనరంజకంబుగా.

కాకినాడ తాలూకా పెదబ్రహ్మదేవగ్రామ
నివాసియు శ్రీ ఖండేరాయని అప్ప
నామాత్యతనూభవుండునగు
నారాయణ కవిచే
రచియింపబడి

SLm. 793
Acc. No. 9317

మొదటికూర్పు 500 ప్రతులు.

సూర్యారావుపేట కాకినాడ. ఆల్బర్టు
ముద్రాక్షరశాలయందు గ్రంథకర్తచే
ముద్రింపించి ప్రకటింపబడినది.

1922.

53

వెల 0—2—0

శ్రీ

# శ్రీగజేంద్రమోక్షము

——[౦]——



మదిరామానినీ మానసాం
భోజ వికసనలసన్మత్త భృంగా గ
రుత్మత్తురంగా పదాంభోజ సం
భూత సద్వాసనా కాశితాంగా ర
మాలింగితాంగా దయాపాంగ
మాహేశ్వరోదగ్ర భాస్వద్ధను
ర్భంగ యశ్శ్వేత ధారాధరా

భాంగ సర్వేశ్వరా సర్వసర్వం సహాభారనిర్వా
హకా ఘోరసంగ్రామదుర్వార దుర్వారదోర్గర్వ
నిర్వాపకా నిర్వికల్పప్రభావా లసత్కృత్తికాకృత్తి
నానాజగద్దోషభారా సురాధార పీతాంబరా

శింశుపా కింశుకా మ్రాతకాశ్వత్థ ఝుంటీకపిత్థా
తసినాది కేళాబ్జుకాసుంద మందార మాకందపు
న్నాగ శ్రీగంధికా చంప సస్యందనాశోక హిం
తాల ఖర్జూర తక్కోల సాలాది వృక్షంబులున్
సింహ శార్దూల మత్తేభ భూదార ఖడ్గాచ్ఛ భ
ల్లూనంగేంద్ర ఖడ్గి ఋలాయాది నానామృగేం
ద్రంబులున్ గండభేరుండ గృధ్రాది నానావిహం
గంబులున్ శారికా కీరకేకిస్వనత్కోకిల శారి
స్వనాదాభిరామోద్యతారామ సంఘంబులున్
జంపమానార్య వీణాకరాంభోజలై వ్రాస్య మా
ధుర్య చాతుర్య గీతంబులన్ బడు గంధర్వయ
క్షాప్సర స్త్రీసమద్వైభవంబున్ నవోత్ఫుల్లరాజీవ
రాజీవ రాజత్తటాకంబులున్ గల్గియొప్పారు స
స్పర్గత పాత్రితకాంతార సీమాంతభాగంబునన్
నిండిదిగ్గంతులన్ మించుదంతావళంబుల్ మదో
న్మత్త దేహంబులై ఘోంకరల్ సేయ నానాగుహా
ద్వార దేశంబులందుండి యేతెంచి యామూయ
ప్రదేశంబులందున్ యథేచ్ఛావిహారంబునన్
లెస్సగా నెండచే దస్సియున్నంచు నాయూన
మున్ బొంది దాహంబుచేగుంది కాసారమున్

కూర్మి తండోప తండంబుగాఁ  క్షైనమై పోవఁగా
ఘోరదుర్వార గాఢాంధ కారంబులో గహ్వ
రద్వార దేశంబులఁ జొచ్చు భల్లూక సంఘంబు
లోఁ గొబ్బునన్వెతలఁ బట్టి తబ్బిబ్బుగా బొబ్బలన్
బెట్టు శార్దూల బృందంబులో భీతిచే జెంగునన్
డొంకలన్ దాటు కుందేళ్లతో తేళ్లతో వాఁగుల
న్వాఁగు తోడేళ్లతో గూళ్లలోనుండి జివ్ జివ్వు
నన్ నింగికిన్ బాఱు పుర్రేళ్లతో బండలామేళ్ల
లోఁ బుట్టలన్ జొచ్చు దర్వీకర శ్రేణితో సమ్మ
హారణ్య దేశంబు గగ్గోలుగానుండఁగాఁ బొట్టుఁబగ్గం
బులున్ లేక కుంజరంబుల్ జొచ్చుచున్ నూతినా
ఘ్లాన సన్మరాళీ పుంజముల్ నుగు నుగాడుచున్
తుండముల్ మింటికిన్ జాచి ఘీల్ ఘీల్లునన్ గొ
మ్ములన్ గూల్చుచున్ లెక్కకుం మించి కస్పట్టు
ము త్తేధయూథంబులోఁ గోటిభార్యల్ హాయి
ల్ మీరఁగాఁ బార్శ్వభాగంబులన్ దన్ను సేవిం
చుచుండన్ గజేంద్రుండు సంతోష మొప్పారఁ
బెంపారు జొంపంబులన్ మేయుచున్ సొంపుగా
గుంభులన్ గూడుచున్ జెంపులన్ దున్నలన్ దూ
ప్పులన్ దంపుచున్ గొండలన్ గూల్చుచున్ గం

దశైలంబులఁ బిండిగాఁ జేయుచుఁ బుండరీకం
బులఁ బట్టి దండించుచుఁ దట్టమౌ చెట్లనీడన్
ముదంబొప్పఁగా నిల్చుచుఁ జేరిమతో భార్య
లఁ దేల్చుచున్ మచ్చికఁ బచ్చికఁ దించుచుఁ
బెద్దకాలంబు స్వేచ్ఛావిహారంబులఁ సల్పుచుఁ
ముప్పిరిఁ గొన్న ప్రొప్పికఁ జెంది తాదైవ
యోగంబుచే మార్గముఁ దప్పి భార్యాసమేతం
బుగా ముందటఁ గొంత దూరంబులో నిర్మల
స్వాదుపాః పూరముఁ దుర్మదాభీల కూర్మేంద్ర
మత్స్యగ్రి కుంభీరముఁ మందరంగత్తరం గా
ఘుంగంభీరముఁ యక్షగంధర్వ రక్షోనరస్త్రీజ
నాధారముఁ రత్నసోపాన పాళీల సత్తీరముఁ
రాజహంసాళీ చక్రవాకాది నానాఖగశ్రేష్ఠ
సంచారముఁ జారు కాసారముఁ గాంచి యుం
దుఁ బ్రవేశించి ధామామణుల్ దాను డెంద
మ్ములుప్పొంగ నందమ్ములై మీఱు కెందమ్ములఁ
దుంచి తోయమ్ములఁ జిమ్మి యాపై మత్తే
దోయముల్ తుండముల్ నిండఁబూరించి పూ
త్కారముల్ సేసి గండంబులఁ. దంష్ట్రాదాల్ల
గొంచుఁ వడిఁ గర్కటగ్రాహ మండూక పా

లర్ దానివక్షమ్మునర్ మూర్ఛపోఁర్ వ్రేయఁగాఁ
గాళ్ల కడ్డంబుగాఁబెన్పుచుర్ నీళ్లలో డాఁగుచుర్
గోళ్లతో వాలముర్ జీరుచుర్ ఝల్లునర్ దంత
ముల్ పళ్లఁగా వ్రేయుచుర్ జల్లునర్ వెన్నుపైఁ
గొట్టుచుర్ డిల్లపోకుండ బింకంబుతో నేనుఁగుర్
లోనికిర్ లాగుచుండర్ గజేంద్రుఁడహంకార
ముర్ దాల్చి తాదుర్నివారోగ్రఘీంకారుఁడై దన్న
హోదగ్ర హుంకారుఁడై భీకరాకారుఁడై ధీరుఁ
డై శూరతర్ గ్రాహముర్ బట్టి తుండంబుతో
నొత్తుపై కీడ్చుచుర్ శైలముర్ దాఁకు శైలంబు
చందాన ఢీకొంచుఁ బెక్కండ్రహోరాత్రముల్
ధాకతోనిల్చి యాహారనిద్రాదులుర్ లేక గ్రా
హంబుతోఁ బోరి పోరాడఁగాలేక వేసారి వేసారి
చింతాసమాక్రాంతుఁడై భార్యలర్ గూడి ఘో
రాటవిర్ స్వేచ్ఛగానుండ కుండంగ నేనయ్య
యొూదైనమా యేటికిచ్చోటికీ నీటికై వచ్చితిర్
నేటికిర్ నేను మున్మ్రాటికిర్ దీనికిర్ నోటికాహా
రమైచిక్కితిర్ జిక్కితిర్ నేఁడునాకిక్కడన్ ది
క్కెవండంచు యోజించి యేరీతిగాఁడిని సేగల్తే
నే దైవముర్ గొల్తునే నెవ్వరిర్ బిల్తు నీబాధకర్

ట్లోక్తుని యీశ్వరా యంచు ధ్యానించుచున్
బూర్వజన్మార్జితజ్ఞాన సంపత్తిచే నాదమధ్యాంత
శూన్యుండు వాఙ్మనసాతీతుఁడెవ్వాఁడో యీవిశ్వ
మెల్లన్ లయంబైన తర్వాత నేకాకృతిన్ దాను
జ్యోతిర్మయాకారుఁడై యుండు వాఁడెవ్వఁడో జం
తుజాలంబులన్ లీలసృష్టిం పరక్షింప నష్టింపగాఁ
బ్రహ్మః ప్రీస్వైరా భిక్ష్యులొప్పన్ బ్రవర్తించు
వాఁడెవ్వఁడో నర్తకశ్రేష్ఠు చందంబునన్ బెక్కు
వేషంబులన్ జూపువాఁడెవ్వఁడో తోఁచియే తోఁచ
నట్లీ జగద్గోళముల్ మాయలోముంచి దోబూ
చులాడించి వ్యామోహమున్ జూపు వాఁడెవ్వఁ
డో సర్వమున్ దానయైసాక్షిగా నుండువాఁడె
వ్వఁడో యట్టిసర్వేశ్వరున్ సర్వశక్తున్ విరీశున్
బరబ్రహ్మమున్ గూర్చి రక్షింపుమా యంచు నే
నెంతప్రార్థించినన్ నిర్దయుండై ప్రసన్నుండు
గాకుండెనంచున్ గజేంద్రుండు చిత్తంబునందున్
వితర్కించుచున్ శ్రీహరిధ్యాన సంకల్పుఁడై
దుర్భరాపన్నుఁడై ఖిన్నుఁడై యక్కటా యెవ్వఁ
కుద్దతిబు రాఁడాయెనంచున్ విచారించుచున్ ది
క్కులన్ జూచుచున్ భక్తలోకాదయాశీల యా

గేలరానాకు నిట్టూర్పులంతంతకున్ హెచ్చుచుం
డెన్ శరీరంబయ్యె ధైర్యంబు క్షీణించె నీసేవనా
పాలించుముల్ తాపుల్ దప్పచుండెన్ సరోజాక్ష
నాపై (బరా కేలరా నా మొఱాలింపరా శ్రీధరా
కూరిరదుర్వార నీరాటరాడ్ఘాటికిన్ దాళలేనింక
వైకుంఠవాసా హరీ శ్రీనివాసా లసత్సర్వనా
సా రథాంగాయుధా సుందరాకార మోహాకంధిరా
న్మందిరా యిందురా వేమిరా యింద్రిరాసుందరీ
వల్లభా దుర్భరా పత్సముద్రింబులో మున్గియుం
టిన్ దరిన్ జేర్చి నన్నాదరింపన్ దొరానీవెకా
ధా మురాధ్యక్ష నీకంటె వేఱొండు దైవంబులే
దంచు నిన్ నమ్మితిన్ బ్రోవరా దేవరా శ్రీవ
రా వేగరారమ్ము బాధన్ నివారింపుమా సజ్జనా
ధార మోదుష్టసంహార సద్భక్తమందార సర్వే
శ్వరా శ్రీహరీ పాహిమాం పాహిమాం పాహి
యంచున్ మొఱల్ పెట్టుచుండంగ వైకుంఠ
పట్టణంబందు నామూలసాధోప కంఠంబుపన్
ధావలన్ దివ్యమందార వృక్షాటవీమధ్యపచ్చం
ద్రి కాంతోత్పలస్నిగ్ధ పర్యంకమందున్ రమా
దేవితో గూడి యుల్లాసమొప్పార సల్లాపముల్

చేయుచుఁ వానియార్తస్వరంబ్బట్టి యాలించిది
క్కుల్ పరీక్షించుచుఁ గద్గదాలాపముల్ వచ్చు
దిక్కున నిదానించి డెందంబులో నయ్యయో
మందవచ్చెఁగదా దుష్టనక్రంబుచేఁ జిక్కి ప్రా
ణావశిష్టంబుగా బాధితుండయ్యె నోహో గజేం
ద్రుండటంచుఁ విచారించి దేవాదిదేవుండు వ
ద్భక్తసంరక్షణోపాయ దీక్షాపరాధీనుఁడై దిగ్గు
నఁ లేచి యయ్యిందిరాదేవితో మారుమాటా
డకుండఁ గరుత్మత్తురంగంబుపై నెక్కకుండఁ
మఱి శ్రీవధూటీకుచద్వంద్వ భాగంబుపై
వ్రేలు చేలాంచలంబైనఁ జేవీడకుండఁ గదాశం
ఖచక్రాది దివ్యాయుధశ్రేణిఁ జేపట్టకుండఁ న
భోభాగమార్గంబుగాఁ దానువేంచేయుచున్నం
తలో వానివెంటఁ రమాదేవి తర్వాతఁ బక్షీం
ద్రుఁడుఁ వానిపొంతఁ ధనుఃఖడ్గకౌమోదకీ
శంఖచక్రంబులా వెంటఁ నారదుండిట్లు వై
కుంఠమందున్న వారందఱా బాలగోపాలముఁ
వెంబడింప నిరమాదేవి డెందంబులో నేమియో
చిత్రమా. స్వర్గలోకంబుపైఁ దైత్యవర్గంబు దం
డెత్తెనా విష్ణుఁడెందుండెనో చూపుమాయం

ఘం దర్శించి దండించుచున్ భక్తులఁ బట్టి
దుర్వారులెందైన బాధించుచున్నారో లేకున్ననీ
వైపరీత్యంబు రాఁగారణంబెద్దియోయంచు నం
దేహమ్మున్ బొందుచుండంగ నాయంతరితంబు
నన్ బోవు చక్రియుద్ధమ్ముఁ గాంచి సద్భక్తితో
దేవతల్ సేతుల్ మోడ్చి తుభ్యంనమో విశ్వరూ
పాయ నారాయణా యాప్రమేయాయ సత్యస్వ
రూపాయ వేదాంతవేద్యాయ యంచున్ మహో
త్సాహులై చేయు కైవార మాలింపకుండన్ ద
దేకాగ్రదృష్టి ప్రసారంబులో భక్తవాత్సల్య
మేపారఁగాఁ దత్ప్రదేశంబునన్ డిగ్గి దుర్వారసం
గ్రామనిర్వక్రమ్ముఁ ఖండితానేక దేవద్విషచ్చక్ర
మ్మున్ విక్రమాటోప సంభూత ఘోహారవాభీల స
ర్వం సహాచక్రమ్ము చక్రమ్ముఁ గాంచి యానక్రి
కరంబు ఖండింపుమా యంచుఁ బంపన్ లసద్భూరి
వంకేజగర్భాండభాండంబు కంపింపగా భీమమై వి
స్ఫులింగచ్ఛటోద్దామమై ఛన్నదిగ్భాగ సాంద్రో
ల్లసద్ధూమమైవంది తానేకబృందారక స్తోమ
మై సీటిలోమున్గి శీఘ్రంబుగాదాని కంఠంబు ఖం
డింపఁగా శ్రీహరీ శ్రీహరీ యంచు నక్రంబు

ప్రాణంబులఁ బాయఁగా నగ్గజేంద్రుండు సం
[illegible]ముఁ బొందె వెన్నుండు శంఖంబు బూ
రించె బృందారకుల్ దుందుభుల్ వేగ మ్రోయిం
పఁగా నప్సర స్త్రీమణుల్ నాట్యముల్ సల్పఁగాఁ
శ్రీమతో నొడ్డుపైఁ జేర్చి కేలూతగానిచ్చి లేఁ తె
మ్మి శుండాగ్రి భయంబేల యాయాసమ్ముఁ దీ
ర్చుకొమ్మంచు నోదార్చి హస్తంబుచే మెల్లగా
దువ్వఁగాఁ దుఃఖముఁ బాసి పూర్వస్థితిం బొంది
ఘీంకారముల్ సేయుచుఁ భార్యలఁ గూడి యు
ప్పొంగఁగా నంతటన్ దేవలాభిఖ్య మౌనీంద్ర
దత్తోగ్ర శాపాభినిర్ముక్తుఁడై పాపసంత్యక్తుఁడై
పూర్వ రూపంబుతో దీననాదానులాపంబుతో
ముంగిటన్ నిల్చి దాసోహమంచున్ నమస్కార
ముఁ జేసి దేవాదిదేవా హరీ వాసుదేవా ద
యార్ద్రస్వభావా లసచ్చిత్ర చిత్రప్రభావా ము
కుందా మురారీ శుభాకార హూహూనమా
ఖ్యుండ దుర్వార గర్వాంధుఁడన్ నేనుగంధ
ర్వుఁడన్ బూర్వజన్మార్జితంబైన నాపుణ్యలేశం
బుచేతన్ భవద్దివ్య రూపంబు నేఁగాంచు భా
గ్యంబు చేకూరె నాకోర్కెలీడేరె నాజన్మమత్యం

త సాఫల్యముం బొంద సర్వేశ్వరా నిన్ను వర్ణింప
నే నెంతవాఁడన్ దురాత్ముండ మూఢుండ నం
చున్ బ్రశంసించి గీతంబులన్ బాడి యా దేవునా
జ్ఞన్ ముదం బొప్పఁగా నాదలం దాల్చి గంధర్వ
లోకంబునందున్ బ్రవేశించె నంతన్ గజేంద్రుం
డు శ్రీవిష్ణు హస్తంబు సుస్పర్శమాత్రంబుచేఁ దా
నగస్త్యాగ్రి శాపాభినిర్ముక్తుఁడై నిర్మలస్వాంతుఁ
డై విష్ణుసారూప్యమున్ బొందె నీదండకంబున్
జనుల్ నిత్యమున్ భక్తితో విన్న మాత్రాన
శ్రీవిష్ణు సాయుజ్యమున్ బొందుట బ్రింబె. సద్భ
క్త చింతామణీ దైవచూడామణీ ధీమణీ చక్ర
పాణీ హరీ రుక్మిణీ వల్లభా వాసుదేవా నమస్తే
నమస్తే నమః శ్రీ శ్రీ శ్రీ.

## శ్రీగజేంద్రమోక్షదండకము.

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

